
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజి
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస
అమ్మ శారదా దేవి
గురు వివేకానంద
గురు సాయిబాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళ స్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

# Free Gurukul

"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్చంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul



Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

* సర్వమంగళాగ్రంథమాల - పంచమ పుష్పము

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# గురు శిష్య సంవాదము

(శివపంచాక్షరీమంత్రార్థము)



ఇయ్యది

సంస్కృతసాహిత్యరత్న, శ్రీకంఠవిద్యాభూషణ,
శైవవాఙ్మయార్ణవబిరుదాంకితులు,
వైదికమతసామరస్య నీలకంఠభాష్యాంధ్రానువాదాది గ్రంథకర్తలు,
శివపారమ్యనిరూపణచతురులు నగు
గౌతమ, పండిత, ఆరాధ్య,

## బ్ర-శ్రీ నిర్మల శంకరశాస్త్రిగారిచే

రచింపఁబడి
ప్రకాశింపఁబడియెను.

సౌమ్య సం॥ నిజాషాఢ కృ॥ పంచమి

2-8-1969

చందాదారులకు ఉచితము - ఇతరులకు వెల రూ. 1-00

శ్రీ నీలకంఠాచార్యాభిమత
శివాద్వైతసిద్ధాంతః సమభివర్ధతామ్



బ్రహ్మశ్రీ లోకారాధ్యులైన

## నిర్మల శంకరశాస్త్రి గురువరేణ్యులు

నివాసము:- మారేడుపల్లి, 184 A, సికింద్రాబాద్.



శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ శివాయ గురవే నమః

## సద్గురు ప్రార్థన

శ్లో॥ అజ్ఞాన తిమిరాంధస్య - జ్ఞానాంజన శలాకయా ।
చక్షు రున్మీలితం యేన - తస్మై శ్రీ గురవే నమః॥

"పరమాత్మను సద్గురువును వేదశాస్త్రములను బాగుగా తెలియకుండుట యను చీకటితో గ్రుడ్డివాడైన శిష్యుని నేత్రయుగమును – శివతత్త్వమును గురుస్వరూపమును వేదశాస్త్ర రహస్యమును శివోపాసనమున క్రమముగా గురు తెలఱగుట యను–కాటుక పుడుకతో బాగుపఱచు దయామయుడైన గురుమూర్తికి నమస్కారము.

# గురు శిష్య సంవాదము

పరమేశ్వరుని లీలావిలాసమగు విశ్వమున ఒకానొక జీవుఁడు - పూర్వానేక జన్మలయందు గావించిన పుణ్యముల బలమున మానవజన్మ

నొందినవాడై పెరిగి పెద్దవాడై లోకజ్ఞానమును సంపాదించి వివాహము చేసుకొని భార్యాసుఖమును పుత్రసుఖమును విశేషముగా అనుభవించియు సంసారములో సారము లేదనియు కాంతాకనకముల వలన సంతృప్తి కలుగదనియు పుత్రులు శాశ్వతఫలమును చేకూర్చువారు కారనియు సత్పురుషుల సాంగత్యమువలన తెలుసుకొని జన్మపరంపరా బంధమును తన్మూలమగు కర్మబంధమును విడగొట్టుకొనుటకు వలయు సాధనము ఎద్దియను ఆకాంక్ష కలవాడై సంసారములోనుండియే తరించు నుపాయమును బోధించు మహానుభావుల నాశ్రయించవలెనను దృఢబుద్ధితో తనవారినిసంప్రదించి స్వగృహమునుండి బయలుదేరెను.

అనేక పుణ్యక్షేత్రములయందు సంచరించి చూచినను ఆతనికి సద్గురువు లభింపడయ్యెను. పుణ్యనదులయందు స్నానము నాచరించి గాంచినను పరమదేశికుఁడు కనపడకుండెను ఇట్లు పలుచోట్ల వెదకినను గానరానందున పరమాత్మయందు భారము నునిచి నిరాశతో స్వగృహమునకు ఏతెంచి చింతాక్రాంతుడై కాలమును గడుపుచుండెను.

కొంతకాలమునకు పక్కవాని పుత్రశోకమును మరియొకని దరిద్రదశను ఇంక నొకని భార్యావియోగమును ఒకానొకని తీవ్రమైన రోగబాధను కనులార గాంచుచు దేశములో కరువు కలరా మున్నగు ఉపద్రవములను గమనించుచు "దీపమున్నపుడే ఇల్లు సరిజూచుకొనవలె" నను సామెత ననుసరించి శరీరేంద్రియ పాటవమున్నపుడే శరీర వాఙ్మానసములను ఇంద్రియములను ప్రకృతి నతిక్రమించియుండు పరమశివుని ధ్యానించి పూజించి తరింపవలెనను పట్టుదలగలవాడై అనుదినము శంకరుని సద్గురువు నందజేయుమని ప్రార్థించుచుండెను.

అట్లు కొన్ని నెలలు గడచిన పిమ్మట కరుణాసముద్రుడగు శంకరునికి ఈతనియందు దయ గలిగినందున ఒకానొక శుభసమయమున నొక మహానుభావుఁడు ఆకస్మికముగా స్వగృహమునకు రాగా గృహస్థుఁడు సకుటుంబముగా ఎదురేగి గృహద్వారములోనికి తోడ్కొని ముంగిలియందు పీఠముపై పళ్ళెరములో మహానుభావుని పాదార విందములను శుభ్రజలముతో కడిగి పాదతీర్థమును శిరముపై చల్లుకొని

శ్రీవారిని పీఠమునందాసీనుని గావించి శ్రీవారి కుటుంబమునకు తగు వసతుల నేర్పరచెను. శ్రీవారి నిత్యకృత్యముల యనంతరము విశ్రాంతి సమయమున ఇట్లు వినయముతో ప్రశ్నించెను.

శిష్యుడు: మహాత్మా! తమ దర్శనముచే ధన్యుడనైతిని. జన్మ మొదలుకొని బాల్యమున క్రీడాసక్తుడనై యౌవనమున విషయభోగలాలసుడనై పరమార్థవిచారము లేనందున చిత్తవిశ్రాంతికై నానాక్షేత్రతీర్థములను సంచరించి చివరకు వేసారి దైవభారమున స్వగృహముఁజేరితిని. ఐతే ప్రస్తుతము ఈ సంసార సాగరమునుండి దరిజేర్చు నుపాయమునకై చింతాక్రాంతుడనైతిని. నాయందనుగ్రహము గలవారై తగునుపాయమును బోధింపుడని ప్రార్థించుచున్నాను.

గురువు: ఓహో! నీవు సంసారములో సారము లేదని బాగుగా తెలుసుకొని విరాగము గలవాడవైతివని తోచెడిని సద్గృహస్థునకు సంసారములోనే శివోపాసనము సారము గలదు అమితమగు ప్రపంచ భోగము పరమార్థమునకే దారితీయును. కావున చింతింపకుము.

శిష్యుడు: ప్రపంచసంబంధము స్థిరము కాదనియు క్లేశ భూయిష్ఠమనియు నా యనుభవములో గ్రహింపగలిగితిని. ఐతే సంప్రతి నాహృదయ పరిపాకమునకు వలయు ఉత్తమోత్తమమగు సాధనము నుపదేశించి నన్ననుగ్రహింపగలరని మనవి.

గురువు: అట్టి సాధనము శివదీక్ష దక్క వేరొండు లేదు. అద్దాని గ్రహించుటచే కోటిజన్మకృత సర్వవిధ పాపములు నశించి ప్రపంచ భోగము సుఖమయమై జన్మరాహిత్య మొదవును.

శిష్యుడు: మోక్షమునకు శివదీక్షయే పరమసాధనమని సెలవిచ్చితిరి. అద్ది సరియే. కాని యితరులు జ్ఞానమును మరికొందరు అన్యదేవతాభక్తిని మోక్షసాధనములుగా వక్కాణించుచున్నవారు. ఇందెద్ది శ్రేష్ఠము?

గురువు: సావధానముగా వినుము! మోక్షమనబడు జన్మరాహిత్యమునకు ఉపాసనారూపమైన భక్తి యవసరము "మోక్షసాధన సామగ్ర్యాం - భక్తి రేవ గరీయసీ" అను నానుడి భక్తినే ముక్తి

సాధనముగా నిరూపించుచున్నయది. ఉపాసన - అనుష్ఠానరూపమైనది కాని శుష్కమైన వాక్యార్థజ్ఞానము కాదని గ్రహింపుము. భగవద్రూపము కరచరణాద్యవయవములతో కూడినదానికన్న శివలింగాకారముగా నుండుట శ్రేష్ఠమని మనశాస్త్రములు ఉద్ఘోషించుచున్నవి. శివలింగమును జ్యోతిర్మయముగా ధ్యానించి పూజించుటకు శివయోగులనఁబడు ఆరాధ్యుల నుండి శివమంత్రమును స్వీకరించుటయు భస్మరుద్రాక్షములను ధరించుటయు భక్త్యతిశయముకలిగెనేని శివలింగమును లేక రుద్రాక్షలింగమును మెడలో నిరంతరము ధరించుటయు అను శివదీక్షయే ఇతర దీక్షలకన్నను సాధనాంతరములకంటెను శ్రేష్ఠమగుచున్నయది.

శిష్యుడు: అయ్యా! శివయోగులన నెట్టివారో విశదీకరింపగలరని వేడుచున్నాను.

గురువు: శివుని గురించిన యోగము(ఉపాసనారూపమైన భక్తి) శివయోగమగును. అట్టి వైదిక శివయోగము కలవారు శివయోగులని పేర్కొనఁబడుచుందురు బ్రాహ్మణులై జన్మించి జాతకర్మాది సంస్కారములను ఉపనయనమును గావింపఁజేసుకొని యథాశక్తి వేద వేదాంగముల నభ్యసించియు ఒకానొక ఉత్తమోత్తమ శివయోగుల వారి చెంత వేధా మను క్రియాత్మకమగు లింగధారణదీక్షను గ్రహించియు ఇష్ట ప్రాణ భావ లింగానుసంధానపరులైయుండు మహానుభావులు శివయోగులని చెప్పఁబడుచున్నవారు.

శిష్యుడు: మహాత్మా! తమ సమాధానములను వినుకొలది చిత్తమునకు విశ్రాంతి కలుగుచున్నయది. తాము సెలవిచ్చిన శివదీక్ష ననుగ్రహించు శివయోగికి సర్వసాధారణముగా వ్యవహరింపఁబడు నామధేయ మెద్దియేని కలదా?

గురువు: శివదీక్ష ననుగ్రహించువాడే గురువని లోకవేదముల యందు వ్యవహరింపఁబడుచున్నవాడు. మఱియు

శ్లో॥ గురుః సద్గుణవాన్ ప్రాజ్ఞః - పరమానందభాసకః ।
తత్త్వవిచ్ఛివసంసక్తః - ముక్తిమార్గావబోధకః ॥

మంచి గుణములు కలవాడు, వేదశాస్త్రములను బాగుగా గుర్తెరిగినవాడు, బ్రహ్మానందమును గురించి విశదముగా సంభాషించువాడును పృథివ్యాది తత్త్వములను కనుగొనినవాడును శంకరునియందు అనన్య భక్తిగలవాడును మోక్షమనఁబడు పరమపదమునకు సరిపడు శివోపాసన యను మార్గమును తెలుపువాడును గురువని చెప్పఁబడును.

గు కారము-అంధకారాత్మకమైన అజ్ఞానమనియు, రు కారము అజ్ఞానమును తొలగించునదనియు గురు శబ్దార్థము.

"యస్య దేవే పరాభక్తిః - యథా దేవే తథా గురౌ" అను శ్రుతి - పరమాత్మను గురువును సమానులుగా భావించి పూజించువానికి ప్రపంచ పరమార్థ విషయములన్నియు విశదపడునని బోధించుచున్న యది.

శిష్యుడు: శిష్యునకు సంసార సంబంధమున్నను గురువునకు మాత్రము సర్వసంగ పరిత్యాగరూపమైన సన్న్యాసమే విహితమని తోచెడిని. గురువు గృహస్థుడైనచో శమదమాది సంపత్తి గృహస్థునకు అలవడుట కష్టతరముగదా! సంసారలంపటుడైన ఆచార్యుడు దారాపుత్రాదిపోషణతత్పరుడై కామక్రోధ లోభమోహ మద మాత్సర్య గ్రస్తుడగు శిష్యుని యుద్ధరింపఁజాలునా?

గురువు: ఆత్మోద్ధరణకై తలపడి మొదట ఆచార్యలక్షణమును తెలుసుకొనుటకు కుతూహలము కలిగిన నీ వివేకము నెంతయు నభినందించుచున్నాను. ఆలకింపుము! గురువు సన్న్యాసియైనచో గృహస్థులైనశిష్యుల నుద్ధరింపఁజాలడు. సంసారులచెంత సన్న్యాసి యుండరాదని ధర్మశాస్త్ర నిర్వచనము కలదు మఱియు కలియుగములో సన్న్యాసము కూడదు వైరాగ్యములేని సన్యాసస్వీకారము నిషిద్ధమైన ప్రవర్తనకు దారితీయును. ఉత్తమ మధ్యమ అధికారము గలవారందరును గృహస్థులయ్యే శివోపాసనఁజేయుచు "స్వయం తీర్త్వా పరాన్ తారయతి" అన్నట్లు తాము కృతార్థులై ఇతరుల నుద్ధరించువారగుచున్నారు.

ఇందుకు ప్రమాణము.

శ్లో॥ గురు ర్గృహస్థ ఏవ స్యా - న్న కదాచి ద్యతి ర్భవేత్,
వానప్రస్థ యతీనాం తు-గురుత్వం నిష్ఫలం భవేత్॥
చంద్రజ్ఞానం (శివాగమ) క్రియాపాదము ద్వితీయ పటలము.

గురువు గృహస్థుడు (సంసారి)గానే యుండవలెననియు ఒకప్పుడు వైరాగ్యము కలిగినచో నిస్పృహావృత్తితో మెలఁగవలెను కాని సన్న్యాసమును స్వీకరింపరాదనియు వానప్రస్థునకుగాని సన్న్యాసికిగాని గురుత్వాధికారము లేదనియు శివాగమములు నిర్వచించుచున్నవి. కర్మయోగమునకు గృహస్థాశ్రమమే విహితమగుటఁ జేశియు సన్న్యాసికి ప్రతిగ్రహము (దానమునుతీసుకొనుట) నిషిద్ధమగుటవలనను శిష్యుఁడు సమర్పించు ద్రవ్యమును గ్రహించు యోగ్యత - గృహస్థుడైన ఆచార్యునకే ఒప్పారుచున్నయది.

శ్లో॥ తస్మా ద్ధనాని రత్నాని - క్షేత్రాణి చ గృహాణి చ ।
భూషణాని చ వాసాంసి - యానశయ్యాసనాని చ ॥
ఏతాని గురవే దద్యాత్ - భక్త్యా విత్తానుసారతః ।
విత్తశాఠ్యం న కుర్వీత - యదీచ్ఛేత్ పరమాం గతిమ్॥

శిష్యుఁడు గురుదక్షిణగా రత్నములను ధనరాసులను పొలముచేనుమున్నగు భూములను గృహములను అలంకారములను మేలివస్త్రములను వాహనములను మంచము పరుపు మొదలగు శయ్యాపరికరములను పీఠము మున్నగు ఆసనములను భక్తిగలవాడై యథాశక్తి సమర్పింపవలెను. తనకు దేహాంతమున ఉత్తమగతి కావలయునని యున్నచో శక్తిలోపమును చేయరాదు.

ఇట్లు గురుదర్శనము ఐనపుడు యథావిధి శ్రీవారి పాదపద్మములను పూజించి గురుపత్నీపుత్ర సహోదరాదులను సౌభాగ్యతండులవస్త్రద్రవ్యాదులతో సత్కరించియు గురువుగారి పాదతీర్థమును స్వీకరించు శిష్యునకు కామక్రోధలోభ మోహాది వికారములు తగ్గి క్రమముగా త్యాగబుద్ధి యలవడును. మఱియు దారాపుత్ర దేహేంద్రియాదులయందు బద్ధత్వము తొలగుచుండును. చిత్తశుద్ధి యొదవును కావున శిష్యునకు

పైకథము వివేకము నాపాదించు గురువు - సద్గృహస్థు డగుటయేగాక విహితకర్మల నాచరించువాడు కావలెను. శివయోగము నభ్యసించు చుండవలెను. ఇట్టి గురువులవారి వద్దినుండి గ్రహింపఁబడిన శాంభవదీక్ష మోక్షావహ మగు ననుటలో సందియ మిసు మంతయు గానరాదు.

శిష్యుఁడు: ఆర్యమహాశయా! శివదీక్ష - మోక్షావహామని సెల విచ్చితిరిగదా! మోక్షమున నెట్టిదో వివరించి చెప్పగలరని ప్రార్థన.

గురువు: దీక్షయన నేమో మొదట తెలుసుకొనినచో మోక్షము సుకరముగా బోధపడును.

**శ్లో॥ దీయతే యేన విజ్ఞానం - క్షీయతే, పాశబంధనమ్,**
**తస్మాత్సంస్కార ఏవాయం - దీక్షేత్యపి చ కథ్యతే ॥**

జీవుడు పశువనియు, సంసారము పాశమనియు, పరమేశ్వరుఁడు పతియనియు వివేకము. పాశమును తొలగించి పతిని గురుతెఱుగు విజ్ఞాన (భక్తి రూపమైన ఉపాసన)మును కలుగఁజేయు సంస్కారము దీక్ష యనఁబడును. జాతకర్మ మొదలగు సంస్కారములు జీవాత్మకు అభ్యున్నతి నొనగూర్చునట్లు శివదీక్ష-నాలుగవ పురుషార్థమగు మోక్షమునకై వలయు శివానుగ్రహామునకు నిదాన మగునట్టిది.

శిష్యుడు: జ్ఞానమువల్లనే కైవల్యము (మోక్షము)సంభవించునని కొందరు వక్కాణించుచున్నారు. తామైతే దీక్షాగ్రహణముచేతనే జన్మరాహిత్య మేర్పడునని యాదేశించితిరి. ఇదెట్లు పొసగును?

గురువు: కుమారా? "జ్ఞానాదేవ తు కైవల్యమ్" మొదలగు వాక్యములు ప్రమాణములైనను జ్ఞానమనఁగా నెట్టిదో తెలుసుకొనినచో విరోధమేమియు గానరాదు. వేదములయందు ఉపనిషదములయందును జ్ఞానఉపాసనశబ్దములను ఒకేప్రకరణమునందు వేదపురుషుఁడు ప్రయోగించి నందున జ్ఞానమనఁగా.... ..ఉపాసనాత్మకమగు భక్తియని తెలియవలెను. "భక్త్యా త్వనన్యయాపార్థ"అని గీతావాక్యము భక్తినే ముక్తిసాధనముగా సమర్థించుచున్నయది. ఐతే ఇట భక్తియనన్య కావలెను. పూజా జప తపోనియమాదిరూపమగు భక్తి మోక్షసాధనములలో శ్రేష్ఠమగునది. "జగన్మిథ్యా బ్రహ్మ సత్యం"అనునది జ్ఞాన ము కా జా ల దు.

ప్రారబ్ధాంతమున ముక్తుడై శివసముడగువానికి జగము శివమయముగా గోచరించు దృఢభావము వాస్తవికమైన శాశ్వతజ్ఞానముగా పరిగణింప బడుచున్నయది. ఇట్టిజ్ఞానమునకు వలయు యోగ్యతకై ప్రతిబంధములు తొలగుటకున్ను కావలసిన పరమేశ్వరానుగ్రహము తనయందు ప్రస రించుటకొరకు శివదీక్ష నవశ్యము గ్రహింపవలసియుండును.

శిష్యుడు: శివదీక్షయనఁగా - శివమంత్రమును గ్రహించుటయే గదా! అట్టి శివమంత్రము గ్రంథములయందు అనేకచోట్ల గానంబడు చుండును గావున గురువుగారి యవసరము లేకయే శివమంత్రమును జపించు నవకాశము కలదని తోచెడిని.

గురువు: ఓయీ? నీకు ఇప్పటికి పరమేశ్వరునియందు శివమంత్ర మునందును విశ్వాసము కలిగి గురుతత్త్వమును కనుగొనవలెనని జిజ్ఞాస యేర్పడినందున కెంతయు ధన్యుడ వగుచున్నావు. చెప్పెద నాకర్ణిం పుము!

లోకములో బాలునకు పూర్వజన్మ సంస్కారవశమున నెంతయో తెలివి యుండినను, అక్షరపరిజ్ఞానము పదార్థజ్ఞానమున్ను ఉపాధ్యా యుఁడు లేనిది కలుగనట్లు ముముక్షువునకు విషయలంపటత్వము తగ్గు టకు సులభమైన భక్తిమార్గము వికాశించుటకున్ను వేదశాస్త్ర పరి జ్ఞానముతో తనయోగ్యతను పెంచుకొని శివయోగము నభ్యసించు ఒనానొక మహాపురుషుని మహోపదేశము అవసరమగుచున్నయది.

"ఆచార్యవాన్ పురుషోవేద" "గురువుగల పురుషుడు పర మాత్మను సమస్తంబును గుర్తెరుగును." "సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్"" వేదశాస్త్రవిదుడు సదాచార సంపన్నుడునగు ఆచార్యుని శిష్యుడు (ఆచార్యునికి కావలసిన) సమిధలు పుష్పములు ఫలములు మున్నగువానిని హస్తమునందిడుకొని సమీపింపవలెను" "ఉపదేక్ష్యంతి తే జ్ఞానం-జ్ఞానిన స్తత్త్వదర్శినః" పరమేశ్వరుని స్వరూపమును ధ్యా నించు శివయోగులు శివోపాసన జ్ఞానము(శివమంత్రము)నుపదేశింతురు" ఇత్యాది శ్రుతిస్మృతి ప్రమాణములు, ధృవమార్కండేయ ఉపమన్యు దధీచి గౌతమ వాల్మీకి ధనంజయాదుల చరిత్రలున్ను ఇక్కాలమున

నెలకొనియున్న బౌద్ధ జైన ఆర్య సిఖ్ఖు మహమ్మదీయాది సంప్రదాయములున్ను శిష్యునకు గురువు అత్యవసరమని సమర్థించుచున్నయవి.

జీవుడు తల్లిగర్భమునుండి బయలువెడలునపుడు కలుగు బాధను సహింపఁజాలక "యది యోనిం ప్రముంచామి - తం ప్రపద్యే మహేశ్వరమ్" "గర్భకోశమునుండి వెలుపడుదునేని మహేశ్వరు నాశ్రయింపగల"నని చేశిన ప్రతిజ్ఞను మరచియుండు శిష్యునకు శివదీక్షాప్రదానముతో జ్ఞాపకము గావించు గురువు-కడుంగడు ఆవశ్యక మగుచున్నవాడు.

మఱియు

శ్లో॥ యథా శివ స్తథా విద్యా - యథా విద్యా తథా గురుః,
శివవిద్యా గురూణాంచ - పూజయా సదృశం ఫలమ్॥

శివుఁడు ఎట్టివాడో శివమంత్ర విద్యయు నట్టిదియే. శివమంత్రవిద్యతో సమానుఁడు గురువగును. శివుని విద్యను గురువును సమానముగా పూజించుటవలన కలుగు ఫలము ఏకవిధముగానే యుండును."

ఐతే శివుఁడు జీవునియందు అచేతనములయందు పూజింపఁబడువాడు. శివవిద్య (మంత్రంబు) అక్షరసముదాయాత్మకమైనను దివ్యశబ్దరూపముగా లింగరూపముగాను వర్ణింపఁబడుచున్నయది. గురువైతేనో శివయోగమున కాశ్రయుడై ప్రత్యక్షదైవముగా గోచరించువాడు.

ఇట్టి శివయోగి - మానవుని తనుత్రయమును పొందియుండు కల్మషములఁబోనాడి శివమంత్రము నుపదేశించుతఱి స్వయంప్రకాశమానుడైన మహాదేవుని స్ఫురింపఁజేయువాడు. తండ్రి కుమారుని నాయాత్మ యనుకొనునట్లు యోగ్యుడైన శిష్యుని తన రెండవ ప్రాణముగా భావించు గురుడు - నిరంతరము సర్వత్ర అన్నివిధములుగా అవసరమగుచున్నవాడు.

శ్లో॥ క్రియా తపో జపై ర్యుక్తా - స్త్రివిధాః శివయోగినః ।
ధనాదివిభవై శ్చైవ - కరాద్యంగై ర్నమాదిభిః॥
క్రియయా పూజయా యుక్తః - క్రియయోగీతి కథ్యతే॥

శివపురాణము - విద్యేశ్వర సంహిత.

శివయోగులు - క్రియాయోగియనియు తపోయోగియనియు జపయోగియనియు ముప్విధములుందురు. ధనము భూమి ఇల్లు మున్నగు సౌకర్యములతో నలరారుచు శివునకు శివయోగులకును శిరము హస్తములు మొదలగు నవయవములతో నమస్కారము మొదలగు సదుపచారములను సమర్పించుచు యథాశక్తి శివయోగుల శివోపాసనము కుటుంబపోషణము మున్నగు అవసరములకై విరాళముల నిచ్చుచు ప్రతిదినము శివుని ఏకకాలమున రెండుకాలములయందు గాని పూజించు మహానుభావులు-క్రియాయోగులనఁబడుదురు.

శ్లో॥ పూజాయుక్తశ్చ మితభుక్-బాహ్యేంద్రియజయాన్వితః।
పరద్రోహవిరహిత-స్తపోయోగీతి కథ్యతే॥ శి.పు వి.సం.

ప్రాతర్మధ్యాహ్న సాయం కాలములయందు శివారాధనఁ గావించుచు మితాహారమును గైకొనుచు బాహ్యములైన కర్మజ్ఞానేంద్రియములను తన యధీనములుగా నుంచుకొని నిర్నిమిత్తముగా పరద్రోహము మున్నగు ద్వేషమును విడనాడి ఏకభుక్తనక్తవ్రతాది నియమములతో స్వదారాసుతపోషణార్థమై శిష్యుల యాచించువారు తపోయోగు లనఁబడుచున్నారు.

శ్లో॥ ఏతైర్యుక్తః సదా శుద్ధః - సర్వకామాదివర్జితః।
సదా జపపరః శాంతో - జపయోగీతి తం విదుః॥

శి పు. వి. సం.

క్రియాయోగికిని తపోయోగికిని చెప్పఁబడిన లక్షణములు కలిగియుండుటయేగాక సర్వవిధములైన కోరికలు లేనివారై క్రోధలోభాది వికారముల నణగద్రొక్కి యెల్లకాలము శివపంచాక్షరీ మంత్రానుష్ఠానమును ప్రాణలింగారాధనమునందు తత్పరులై శాంతస్వభావులగువారు-జపయోగులనఁబడుదురు.

మనోనైర్మల్యమునకు గుర్తుగా మడిధోవతి కట్టుకొనినవారై భస్మరుద్రాక్షలఁదాల్చి గురుప్రదత్తమైన శివలింగమును లేక రుద్రాక్షలింగమును కరతలమునందుంచుకొని సుఖాసీనులై లింగమును చూచుచు

గురూపదిష్టమైన శివపంచాక్షరీమహామంత్రమును సుసమయములయందు జపించుచుండవలెను.

జపము - వాచికమనియు ఉపాంశువనియు మానసిక మనియు ముప్విధమగును. ఇతరులకు వినఁబడునట్లు మంత్రమును ఉచ్చరించుట వాచిక జపముగాను ఏమాత్రము పరులకు వినఁబడకుండా పెదవుల కదలికతో మాత్రము మంత్రము నావర్తించుట ఉపాంశు జపముగాను మంత్రార్థమును భావించుచు మనస్సులోనే మంత్రమును జపించుట మానసిక జపముగాను తెలియునది.

"మననాత్త్రాయత ఇతి మంత్రః" మననము (మాటిమాటికి చింతించుట) వలన కాపాడునది మంత్రమగును. "తజ్జప స్తదర్థభావనా" మంత్రార్థమును మనస్సులో తలపోయుట వాచిక ఉపాంశు మానసిక జపములలో ముఖ్యమైనది.

శిష్యుడు: ఆచార్యా! ఇప్పటికి తమ యమోఘ మధుర వాక్సుధారసమున నామనస్సు నిస్సందిగ్ధమైనది. శివదీక్షను తీసుకొనినవారు భస్మరుద్రాక్ష మంత్రలింగములనే గాక నితరములను గ్రహింపవలసి వచ్చునా?

గురువు: మన శాస్త్రమున శివవిద్యా గురువులకు సమానత్వము చెప్పఁబడినట్లు చరునకు తీర్థప్రసాదములకును ఆదరణీయత్వము కలదు. చరుడనగా - గురునితో సమానముగా శాంభవదీక్షఁగ్రహించి శివయోగము నభ్యసించు మాహేశ్వరుఁడగును. గురుచరణ తీర్థమువలె మాహేశ్వర చరణతీర్థంబును గ్రాహ్యమగుచున్నయది.

శివప్రసాదమువలె గురువుచే మాహేశ్వరునిచేత నొసగఁబడిన ఆహారసూక్ష్మాంశము పరమపవిత్రముగా స్వీకరింపఁదగినది. ఇట్లు శివదీక్షితులకు భస్మ రుద్రాక్ష గురు మంత్రి లింగ మాహేశ్వర తీర్థ ప్రసాదములను ఎనిమిది ఆవరణములు ఏర్పడుచున్నవి. కావుననే సకలవిధ పాపములకు ప్రాయశ్చిత్తము గురుచర పాదతీర్థప్రసాదములను గ్రహించుటయని పెద్దలు వక్కాణించిరి. శిష్యులను గురువు శాసించుననియు

ఇతరులను యమధర్మరాజు శిక్షించుననియు ధర్మశాస్త్రము బోధించు చున్నయది.

శిష్యుడు: తాము వక్కాణించినది సత్యము పరమార్థంబునని తెలుసుకొనగలిగితిని. మెడలో ధరించిన శివలింగముగాని రుద్రాక్ష లింగముగాని యెల్లకాలము సన్నిధి నుండు కాని గురువుగాని మాహేశ్వరుఁడుగాని యుండజాలరు గదా! కావున నిత్యము గురు పాదతీర్థమును గ్రహించుట యెట్లు పొసగును?

గురువు: గురువునుగాని మాహేశ్వరుని గాని నిత్యము సన్నిధిని ఉంచుకొన నవకాశము లేనివారికి మరియొక ఉపాయమును పెద్దలు విధించియున్నారు. గురుని పాద తీర్థమునందు విభూతిని తడిపి అట్టి భస్మ నొక పేటికయందు నునిచి నిత్యము జలమున కొద్దిగా వేసి తీర్థముగా గ్రహింపవలెను. రుద్రాక్షలింగమునుగాని శివలింగమును గాని ధరించినవారు అవ్వాని తీర్థమునే గురుపాదతీర్థముగా భావించి స్వీకరింపవచ్చును.

శిష్యుడు: మహామంత్రములనేకములుండగా శ్రీ శివపంచాక్షరియే భోగమోక్ష కాములందరికిని ఏల గ్రాహ్యంబయ్యెను ?

గురువు: ఓహో! నీప్రశ్నములను వినుకొలది మనస్సునకు మిగుల సమాధానము కలుగుచున్నయది. మరియు విధేయుడవగు నీ విజ్ఞానమున కెంతయు నచ్చెరువు నొందుచున్నాను. చెప్పెదను వినుము!

**శ్లో॥ విద్యాసు శ్రుతి రుత్కృష్టా - రుద్రైకాదశినీ శ్రుతౌ।**

**తత్ర పంచాక్షర స్తత్ర - శివ ఇత్యక్షరద్వయమ్॥**

అష్టాదశవిద్యలలో వేదము శ్రేష్ఠమైనది. వేదమునందు రుద్రాధ్యాయము నుత్తమము. రుద్రాధ్యాయమున శివపంచాక్షరీ మహామంత్రము గణనీయమైనది. శివపంచాక్షరియందు శివనామము మహాత్తరమగునది.

వేదపురుషునకు హారములో నాయకమణివలె విరాజిల్లు శివశబ్దముతో సంఘటితమైన శివపంచాక్షరీ మహామంత్రమును ప్రణవార్థము

గాను స్థూలప్రణవముగాను పరమేశ్వరుడు బోధించెను. ఇతర మంత్రములు - అల్పార్థము గలవిగాను బహ్వాక్షరములు గలవిగాను తాంత్రికములుగాను కల్పితములుగాను అప్రసిద్ధములుగా నుండుటచే భగవత్సన్నిహితములు కాకున్నవి. కావున నియ్యదియే సర్వత్ర ప్రవర్తితంబై ముముక్షువులకేగాక బుభుక్షువులకును జపనీయ మగుచున్నయది. శివపంచాక్షరీమహామంత్రి మొక్కటియే ఇహపరములయందును శ్రేయస్కరమైనది.

తొల్లి ఒకానొక మహారాజు - భార్యచే ప్రేరేపింపఁబడి గర్గ మహామునిచెంత శివపంచాక్షరీ మహామంత్రోపదేశముఁబడసిన తోడనే వేలకొలదిపూర్వజన్మలయందు చేసిన దురితములన్నియు కాకుల రూపముతో బయలువెడలినట్లును సానంద మహర్షి.... ఈ మహామంత్ర ప్రభావమున నరకవాసులను కైలాసమునకు తీసుకొని పోయినట్లును ఉపమన్యు దధీచి గౌతమ శ్రీరామ శ్రీకృష్ణాది లోకోత్తర పురుషులు శివపంచాక్షరీమంత్రము ననుష్ఠించియే కామితములఁబడసి శివానుగ్రహపాత్రులైనట్లును ప్రమాణములు చాటుచున్నవి.

శిష్యుఁడు: మహాప్రభో! ప్రపంచమున నానాదేవతల నుపాసించు వ్యక్తులు పెక్కురు కనఁబడుచున్నారు. కావున యథార్థముగా పరమాత్మను ధ్యానించువారికి నానామతములుండుటఁజేసి వ్యవసాయ (నిశ్చయ) బుద్ధి కలుగకున్నయది. ఐతే పరమేశ్వరుని అనన్యభక్తితో ఆరాధించుటకు భక్తులందరికిని రుచింపదెందులకో యని విచారమొదవుచున్నయది.

గురువు: నీవడిగినది జీవగతము కాని ఈశ్వరచేష్టితము కాదు. ఐనను పరమేశ్వరుని సృష్టిలో బ్రహ్మవిష్ణ్వాదిదేవతలు ఆయా పదవుల యందధిష్ఠానముఁజెందినవారు గాన ప్రాణులు తమ తమ యోగ్యత ననుసరించి ఆయా మతముల నవలంబించి శివేతర దేవతలను పూజించుట పరిపాటియైనది.

"కోటిజన్మార్జితైః పుణ్యైః - శివే భక్తిః ప్రజాయతే" శివగీత.

పూర్వానేకజన్మలయందు గావింపఁబడిన వ్రతములు పూజలు దానములు మొదలగు పుణ్యములవలన శివునియందు భక్తి కలుగును. యత్కించిత్ సుకృతములచే ఇతర దేవతలయందు భక్తి జనించును అట్లు కలిగిన భక్తి క్రమముగా పెంపొందినచో ముక్తిసన్నిహితజన్మలలో శివభక్తి యావిర్భవించును. "బహూనాం జన్మనా మంతే - జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" అను గీతావచనము ననుసరించి చివరిజన్మయందు శివజ్ఞానముకలవాడై "అస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతి రుప సంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే"అను శ్రుతిప్రకారము శరీరము నుండి బయలుదేరి పరమేశ్వరు నాశ్రయించి సచ్చిదానందమయమైన నిజరూపమును ప్రత్యక్షముగా చూచువాడగును. మఱియు "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహబ్రహ్మణా విపశ్చితా"అను శ్రుతివాక్యముఁబట్టి సర్వజ్ఞుడైన శివునితో ఏకకాలమునందు సకలకామాత్మక శివానందము ననుభవించువాడగును. ఇట్టి మహాశయు నుద్దేశించియే శ్రుతి "న సపు నరావర్తతే"మరల నీ దుఃఖభూయిష్ఠమైన సంసారములోనికి వచ్చి జన్మ పరంపర బొందువాడు కాజాలడని నిర్ధారించినది. పిల్లవానికి ఆటలు, వయసువానికి విషయసుఖము. ముదుసలికి పుత్రపౌత్రాది వైభవంబు రుచించునట్లు బహుజన్మవృద్ధునకు శివదీక్షయందును శివోపాసనయందును అభిరుచి కలుగును. ఈ యభిరుచి భక్తిరూపమై క్రమముగా నిష్కామ భక్తియై నిరంతర తైలధారవలె నవిచ్ఛిన్నమై అద్వితీయమగును.

సత్త్వ రజస్తమోగుణాతీతమై స్వయంప్రకాశమానమగు శివ లింగమునందే బ్రహ్మ విష్ణు రుద్ర మహేంద్ర సూర్యచంద్రాది దేవతా రూపములు అవయవములుగా ఆధారపడియున్నవని దృఢభావన యంకురించును.

శ్లో॥ సంసార సర్పదష్టానాం-జంతూనా మవివేకినామ్,
చంద్రశేఖర పాదాబ్జ - స్మరణం పరమౌషధమ్॥

ప్రాణులందరు సదసద్వివేకము లేనివారగుటచే సంసారమను మహాసర్పముతో మాటిమాటికి కఱువబడి పుట్టుచు గిట్టుచున్నారు. జననమరణాదిరూపమగు ఈమహారోగమును బోగొట్టుకొనుటకు చంద్రశేఖరుని పాదారవిందములను స్మరించుట ఆరాధించుట యనునదియే పరమ ఔషధమగుచున్నయది.

ఐతే నే చెప్పిన శివదీక్షను పరిగ్రహించి గురూపదిష్టరీతిని శివుని ఆరాధించువారికి ఇతరమతద్వేషముకాని అన్యదేవతలను నిందించుట గానికూడదు. మతములన్నియు నా మతములోనే కలవనియు దేవతలందరును శివునిపరివారమేయనియు భావించి తరింపవలెనను నంశము నిందలి సారాంశముగా గ్రహింపుము.

అదియెందుకు ఇదియెందుకు అను హేతువాదములను విడనాడవలెను. గురువే ప్రత్యక్షదైవమని భావింపవలెను. ప్రతిదినము తప్పక భస్మ రుద్రాక్షల ధరించి పంచాక్షరీమంత్రమును జపింపవలెను. శివపూజ నాచరింపవలెను. అన్యమతములను పరబోధలను ఉపేక్షింపవలెను. స్వమతమును యథాశక్తి ప్రచారము జేయవలెను. యుక్తప్రాయంబున భార్యాపుత్రాదులతో కూడి గురూపదేశమును పొందవలెను.

గురూపదేశమునకు మంచి సమయ మవసరము. మహాశివరాత్రి మొదలగు పర్వకాలములయందు గురుడు స్వయముగా అనుగ్రహించి నపుడున్ను కాలనియతిని పాటింపవలసిన యవసరములేదు. ఇట్టి యుపదేశమును పరంపరాగత కులగురువుల వద్దనే గైకొనవలెను. అన్యుల నుండి గ్రహించినచో ముప్పు వాటిల్లును. మంత్రోపదేశము మొదలగు శివదీక్ష - మోక్షమునకే గాని శ్రీమంతమునకు సంతానమునకు ఆరోగ్యమునకు ఆయుష్యమునకు కాదు. కాని శివదీక్షాప్రభావము వలనను గురుసేవవలనను సంసారసంకటములు క్రమముగా తొలగును. భోగమోక్షంబులును చేకూరును.

శిష్యుడు: స్వామీ! తమ యపారకరుణ ప్రబోధరూపముగా నాయందు ప్రసరించినందుల కెంతయు ధన్యుడను. ఇక నే శరణమును వేడుచుంటిని. నన్ను శివదీక్షితుని గావింపగలరని ప్రార్థన.

గురువు: నీ కోర్కె ననుసరించి శివదీక్షను ప్రసాదింతును. పిమ్మట మంత్రార్థమును జపలక్షణమును మంత్రస్వరూపమును వివరింపగలను. ఇప్పటికే కాలమతిక్రమించినది. సాయంకాల శివారాధనమునకై కడంగ వలయును.

అని ఆచార్యుడు ఆసనమునుండి లేవగా శిష్యుడు సాష్టాంగము నిడి కాలోచితములను గావించుటకు అటనుండి వెడలెను.

ఇతి సర్వం శుభమ్

---

# ప్రకటన

## భగవద్గీతారహస్యార్థమును

తేటతెనుగున వ్రాశితిని. భక్తులు చేయూత నొసగిన యెడల పుస్తకరూపమున ముద్రింపఁజేయఁబడును.

గీతాపారలక్షణమును తదితర వివరములను అందు తెలుపుదును. గ్రాహకులు త్వరలో తమపేరు చేర్పింతురుగాత !

నిర్మల శంకరశాస్త్రి

శ్రీ మహాగణాధిపతయే నమః

సద్యోజాతాది పంచబ్రహ్మ మూర్తయే శివాయ నమః



# శ్రీ శివ పంచాక్షరీ మహామంత్రార్థము.

—0—

శ్రీమదనంతకల్యాణగుణసంపన్నుఁడు, సచ్చిదానందమయుడు, జ్యోతిర్మయుడు, అనంతలీలావిగ్రహుఁడు, సనకసనందనాదిబ్రహ్మమానస పుత్ర పరివేష్టితుఁడు, హరిహరబ్రహ్మాది సురసేవితపాదాబ్జుఁడు, గౌరీ విభూషితవామాంగుఁడు, గజముఖషణ్ముఖాది జనకుఁడు, శుద్ధస్ఫటిక దివ్యమూర్తియు, సంకల్పమాత్ర నిర్మిత జగజ్జాలుఁడు, శుద్ధసత్త్వవిరాజితుఁడు, నగు సదాశివుని యనుగ్రహమున ముక్తిదశఁబొందు జీవాత్మ - పూర్వసుకృతబలమున శివస్వరూపుడైన ఆచార్యునకు విధేయుఁడై గురు తత్త్వమును శాంభవదీక్షఁదగు ఆవశ్యకతను కనుగొని ప్రసన్నచిత్తుడై కల్యాణదేశికుని కటాక్షమువలన శుభసమయమునందు దీక్షితుఁడై విశ్రాంతిసమయమున కులపరంపరాగతమహాత్ముఁడగు గురుని దిగువ విధము ప్రశ్నించెను.

శిష్యుఁడు: ఆచార్యా! సాష్టాంగప్రణామమును చేయుచున్నాను సకలదేవతాసార్వభౌముడైన మహాదేవుని మహిమను వేదశాస్త్రములు, మహర్షులు, వేనోళ్ళ పొగడుచున్న నవ్వారికి శివతత్త్వము పూర్తిగా విశదపడలేదనియు వ్రతములు మొదలగువానితో పరమేశ్వరుని యథార్థ స్వరూపము గోచరింపదనియు శాంభవదీక్షఁబరిగ్రహించి శివపంచాక్షరీ మంత్రార్థమును పెద్దలవలన తెలుసుకొని శివునుపాసించువారికే ఆత్మ జ్ఞానము కలిగి పరమేశ్వరుని సాక్షాత్కరించుకొను సామర్థ్యమేర్పడు

ననియు తమ ప్రబోధములోని సారాంశముగా గ్రహించితిని. మఱియు ఈ విధేయుని (నన్ను) శాంభవదీక్ష ప్రసాదించి ధన్యుఁ జేసితిరి. ఇఁక శాంభవదీక్షా ప్రధానాంగమగు శివపంచాక్షరీమంత్రముఁదగు అర్థమును అనుష్ఠానవిధానమును తెలుపగలరని ప్రార్థన.

గురువు: కుమారా! నీవలె పరమార్థచింతగలవారికి ఎట్టి భయమును లేదు. ప్రతిమానవుఁడు బాల్యమునుండియే విజ్ఞానము నార్జించి "సత్యంవద! ధర్మంచర!" అను శ్రుతి ననుసరించి యథార్థముగా ప్రవర్తించుచు నిజవర్ణ ఆశ్రమోచితధర్మమును యథాశక్తి ఆచరించుచుండవలెను.

ఇట్టి ధర్మమును నిష్కామముగా చేయువాడు లోకకల్యాణమును పరమేశ్వరప్రీతిని సంపాదింపగలుగును. జపరూపముగాను పూజనరూపముగాను భజనరూపముగాను ఆచరింపఁబడునది నివృత్తి ధర్మమనఁబడును.

ప్రతిదినము నియమితసమయములయందు గురూపదిష్టమైన మహామంత్రమును జపించుచు శివుని ఆరాధించుచున్నయెడల పూర్వకృత పాపములన్నియు నశించును. పరమేశ్వరునియందు సంపూర్ణ దృఢభక్తియు కలుగును.

లోకమున తలిదండ్రులను సత్కరించువాడు కీర్తి సుఖములను పొందునట్లు ప్రపంచమాతాపితరులగు పార్వతీపరమేశ్వరుల నారాధించువారు చిరాయురారోగ్య భాగ్యములను సత్సంతానమును బడయుటయే గాక ప్రారబ్ధాంతమున జన్మరాహిత్య(మోక్ష)మును చెందుదురు. ఐతే శివారాధనమున పార్వతీపరమేశ్వరవిగ్రహములను వేరువేరుగా నెలకొలిపి పూజించుటకన్న సకలజగదాధారము ప్రణవాత్మకము మాతాపితృ స్వరూపంబునగు శివలింగమును పూజించుట శ్రేష్ఠంబని దిగువ ప్రమాణము చాటుచున్నయది.

**శ్లో॥ సాదేవీ జగతాం మాతా - సశివో జగతః పితా,**
**పితృమాతృస్వరూపేణ - శివలింగం ప్రపూజయేత్॥**

శివపురాణము - విద్యేశ్వర సంహిత.

పరాశక్తిని జగన్మాతగాను సదాశివుని జగత్పితగాను శివలింగము నందు భావించి శివలింగమును పూజింపవలెనని యర్థము.

అందుకు మొదట శివమంత్రదీక్షా దీక్షితుఁడగుట ముఖ్యాతిముఖ్యమగుచున్నయది. శివదీక్షకు ముందు శిష్యుడగువాడు ఉపనయమును గావించుకొని గృహస్థుడు నై సద్గురువు నాశ్రయింపవలసి యుండును. ఇట్టి శివదీక్ష సంపూర్ణమగుటకు దిగువవిధము విభాగమును గాననగును.

శ్లో॥ రుద్రాక్షధారణాత్ పాద - మర్థంపై భూతిధారణాత్,
త్రిపాదం మంత్రజాప్యాచ్చ-పూజయా పూర్ణభక్తిమాన్॥

రుద్రాక్షులను ధరించుటవలన శివభక్తిలో నాలుగవ భాగమగుననియు విభూతిని (మూఁడు రేఖలుగా నొసట, భుజములపై, చేతులపై ఛాతిని) ధరించుటఁజేశి అర్ధభాగమగుననియు శివపంచాక్షరీమహామంత్రమును జపించుటతో మూఁడుభాగములగుననియు శివలింగమును విధి విధానముగా పూజించుటవలన పరిపూర్ణత యేర్పడుననియు తెలియవలెను.

శ్లో॥ పంచాక్షరజపేనైవ - సర్వ సిద్ధిం లభే న్నరః॥

శివదీక్షితుఁడు - పంచాక్షరీజపముతోడనే సర్వవిధమైన అనగా భోగమోక్షముల సిద్ధిని పొందఁజాలును.

శిష్యుఁడు: మనస్సు చంచలమగుటఁజేసి వయఃపరిపాకము(పెద్దతనము) కలిగినపుడు మోక్షవిచారమును చేయవలెననియు ప్రపంచగతములైన సంకటములు పెక్కు బాధించుచున్నవనియు ప్రారబ్ధ యోగమున్నచో ఎద్దియేని ఘటించుననియు కొందరు వక్కాణించుచున్నారు. ఇద్దాని కేమందురు?

గురువు: మొదట ఇట్టి సంకుచితమైన అభిప్రాయమును తొలగించుకొనువాడే వివేకి యనఁబడును. ఆచార్యుని అమృతవాణియందు విశ్వాసము నునిచి "రోగము ఉండగానే ఆరోగ్యముకొరకు మందు తీసికొనునట్లు" శారీరక మానసిక బాధలను పాటింపక సాధ్యమైనంత శీఘ్రముగా శాంభవదీక్షను పరిగ్రహింపవలసియుండును. పూర్వసుకృత

పరిపాకము ననుసరించి కలుగు వివేకమును వికసింపఁజేయుటకే ఈనాఁడు ఆచార్యరూపమున శిష్యుని సమీపించి యనుగ్రహించువాఁడు శివుఁడేను. ఇంద్రియ వికారములు దినదినము పెరుగు స్వభావము గలవి. ప్రారబ్ధ యోగములన్నియు భోగరూపములేగాని మనముచేయు ప్రయత్నములు కాఁజాలవు. ప్రయత్నము లెప్పుడును బుద్ధిబలము నాశ్రయించియుండును. "బుద్ధిః కర్మానుసారిణీ" అను వాక్యమందలి కర్మశబ్దమునకు ప్రయత్న మను నర్థముఁజేసినచో పురుషుడు చేయు ప్రయత్నము ననుసరించి బుద్ధి బలము గోచరించునని విశదమగును. సంకల్పవికల్పాత్మకమైన మనస్సుపై ఆధారపడినచో ఏకార్యంబును నెరవేరజాలదు. దైవము బుద్ధిరూపముగా మానవునికి సహకారమును చేయునది గావున "దైవం చైవాత్ర పంచమమ్" అను గీతావాక్యము సరిపడుచున్నయది. యుక్తాయుక్త వివేకము గలవాఁడు బుద్ధిమంతుడనఁబడును. ఇట్టి బుద్ధి స్వకీయమైనచో సుఖకారియగును. పరబుద్ధి వినాశమునకు దారితీయును. స్త్రీబుద్ధి ప్రళయము నాపాదించును. ఐతే ఈయన్నిటికన్న గురుబుద్ధి విశేషముగా ఉపకారకమని భావించి గురూపదిష్టమార్గముగా శివుని ఆరాధింపవలె ననియు అందుకు ముందు శివపంచాక్షరీమహామంత్ర స్వరూపమును అర్థాని రహస్యార్థమును జపవిధానమును గుర్తెరుగుట యత్యావసరము కావున తత్సమాచారము నంతయు వివరించెదను. సావధానుడవై వినుము.

## శివ పంచాక్షరీ స్వరూపార్థ నిరూపణము.

నిఖిలవేదమూలమగు ప్రణవము సూక్ష్మమనియు స్థూలమనియు రెండు విధములగును.

**శ్లో॥ సూక్ష్మమేకాక్షరం విద్యాత్-స్థూలం పంచాక్షరం విదుః ॥**

ఐతే సూక్ష్మప్రణవము ఒకేయక్షరము గలదియనియు స్థూల ప్రణవము పంచాక్షరములు కలది యనియు తెలియవలెను. ప్రణవమును సూక్ష్మపంచాక్షరిగాను పంచాక్షరీమంత్రమును స్థూలపంచాక్షరిగాను భావింపవలెను.

సూక్ష్మపంచాక్షరి యనఁదగు కేవల ప్రణవమును జపింప నధికారము సన్న్యాసులకే నుండును. సంసారులై పరమశివునుపాసించువారు స్థూల పంచాక్షరీమహామంత్రమే ఇహపరశ్రేయోదాయక మని భావించి జపింపనగును. నమఃపూర్వకము చతుర్థ్యంతమునగు శివనామము స్థూల ప్రణవమనియు పేర్కొనంబడును.

**శ్లో॥ ప్రణవేనాదిసంయుక్తం – సదా పంచాక్షరం జపేత్॥**

వేదాధికారము గలవారందరు సురాపానము మున్నగు నిషిద్ధ కృత్యములను విడనాడి ఓంకారము మొదటగల పంచాక్షరీ మంత్రము నెల్లకాలము జపింపవలెను. ఇద్దానినే షడక్షరి యనవచ్చును. వేదాధి కారములేనివారు ప్రణవమును విడనాడి కేవలము పంచాక్షరినే జపింప వలసియుండును.

అకార ఉకార మకార బిందునాదములనఁబడు ఐదు నుండుటచేశి ప్రణవము సూక్ష్మపంచాక్షరి యనఁదగుచున్నది. నకార మకార శికార వాకార యకారములను నైదక్షరములచే నొప్పారు మహామంత్రము స్థూలపంచాక్షరి యనఁబడుచున్నయది.

## పంచాక్షరీ స్వరూపము

**శ్లో॥ ఓంకారవదనా దేవీ – వాయకార భుజద్వయీ।**
**శికార దేహమధ్యాచ – నమకార పదద్వయీ॥**
**పంచాక్షరీ పరా విద్యా – సతారా లింగరూపిణీ।**
**శివమంత్రాభిధా శైవీ–మమాంగే సుప్రతిష్ఠితా॥**

పంచాక్షరీమహామంత్రము పరావిద్య యనదగును ఇట్టి పరావిద్యఁ దగు స్వరూపమును – ఓంకారమును ముఖముగాను వాయకారములు రెండుభుజములుగాను శికారము నడుముగాను నమకారములు రెండు పాదములుగాను–గురుతెఱుగవలెను. లింగస్వరూపిణియగు పంచాక్షరీవిద్య జపకాలమున నా శరీరమునందు నెలకొనియుండుగాత! యని సాధకుడు ప్రార్థింపవలసియుండును. మఱియు శివపురాణమునందలి వాయవీయ

సంహితలో ఉత్తరభాగమున చతుర్దశాధ్యాయమున పంచాక్షరిని ఒకానొక దివ్యమూర్తిగా పేర్కొనవైనది.

శ్లో॥ తప్తచామీకరప్రఖ్యా-పీనోన్నతపయోధరా॥ ౪౦
చతుర్భుజా త్రిణయనా-బాలేందుకృతశేఖరా।
పద్మోత్పలకరా సౌమ్యా-వరదాభయపాణికా॥ ౪౧
సర్వలక్షణసంపన్నా-సర్వాభరణభూషితా।
సితపద్మాసనాసీనా-నీలకుంచితమూర్ధజా॥ ౪౨

పంచాక్షరీపరావిద్య – ఒకానొక దివ్యవనితారూపిణియగును. ఆ యమ్మ స్వరూపము అగ్నితప్తమైన బంగారముతో సరిపడువన్నెగలది యగును. వక్షోజములు బలసినవై ఉన్నతములుగా నుండును. నాలుగు చేతులు మూడుకన్నులు కలిగి బాలచంద్రుని శిరోభూషణముగా ధరించుటయు; కమలము, కలువ,వరదముద్ర, అభయముద్ర అను వానిని నాలుగు చేతులందాల్చుటయు; శాంతమైన వర్చస్సుతో శుభలక్షణములన్నియు కలిగి సొమ్ములన్నిటిని మేనందాల్చుటయు, పంచాక్షరీపరాంబికా స్వభావములగును. ఆ పరాశక్తిదగు తనువునకుండు వెంట్రుకలు నలుపువన్నె గలవై ముంగురులుగా నుండును. ఆ యమ్మకు పీఠము – శ్వేతకమలమగును.

ఏకముఖమైన పంచాక్షరీపరాశక్తి – ఐదు వన్నెలతో నలరారునట్టిది. నకారము పసుపువన్నె గలదనియు మకారము నలుపువన్నె గలదనియు శికారము పొగరంగు కలదనియు వాకారము బంగారు ఛాయ కలదనియు యకారము ఎరుపువన్నె కలదనియు పెద్దలు చెప్పుదురు.

## శివ నామ నిర్వచనము

శ్లో॥ శం నిత్యం సుఖ మానంద-మికారః పురుషః స్మృతః।
వకారః శక్తి రమృతం-మేలనం శివ ఉచ్యతే॥

శివశబ్దములో శ, ఇ; వ, అను విభాగము ననుసరించి "శం" అనగా నిత్యము సుఖమయమునగు ఆనందము "ఇ"అనగా శివదీక్షాదీక్షి

క్షుడై శివగురు మంత్రములయందు భక్తివిశ్వాసములు కలిగి అనేకసుకృత లబ్ధమైన దేహమునందు ప్రకాశించు జీవుఁడు, "వ"అనగా అమృత రూపిణియగు శక్తి. ఐతే నిత్యసుఖానందమును జీవునకు అమృత(ముక్తి) స్వరూపిణియగు ఆదిశక్తి అనుసంధించుటయే శివశబ్ద స్వరూపమని విశదమైనది.

మఱియు

శ్లో॥ మహాపాతకవిచ్ఛిత్యై-శివ ఇత్యక్షర ద్వయమ్।
అలం నమస్క్రియాయుక్తో-ముక్తయే కల్పతే మనుః॥

"శివ"అను రెండక్షరములు ఉచ్చరింపఁబడినమాత్రమున గొప్ప పాపములు నశించును ఇక నీ శివశబ్దమునకు నమఃపదమును జతపఱచి నచో నొకానొక మహామంత్రమగును. ఇట్టి మహామంత్రమును జపించిన యెడల మోక్షము కరతలామలక మగుచున్నయది.

శివపంచాక్షరీమంత్రము సిద్ధించిన తరువాత నే మంత్రమైనను త్వరలో సిద్ధించును. ఐనను ఇద్దానిని క్షుద్రఫలములకొరకై వినియోగింపరాదు

స్వగృహములో యోగ్యప్రదేశమునందు పుణ్యనదీతీరముల యందు దేవాలయమునందు పర్వతముపైనను క్రూరజంతువులు దోమలు ఈగలు పొగ మొదలగునవి లేకుండా చూచుకొని నలుచదర మైన ప్రదేశమునందు మృదు ఆసనమున నాసీనుడై ప్రతిదినము నియమముగా నీ మహామంత్రమును జపించవలెను.

శ్లో॥ సద్యో యథేప్సితాం సిద్ధిం-దదాతీతి కిమద్భుతమ్॥

సాధకుడు యథావిధి జపించినచో నీ మహామంత్రము-తత్కాలముననే అభీష్టమును సిద్ధింపఁజేయుననుటలో ఆశ్చర్యమేమియు లేదు.

శివపంచాక్షరీమహామంత్రమును దేవతలు ఋషులు మానవులును జపించి తామకోరిన ఫలితములను పొందియున్నారు. ఇందలి "నమ"స్కారమునకు జీవుఁడనియు "శివ"శబ్దమునకు పరబ్రహ్మమనియు. "ఆయ" అను పదమునకు ఐక్యమనియు కొందరి యభిమతముగా స్కాందపురాణములో కలదు ఐతే ఇట్టి శివజీవైక్యమును జపకాలమునందు శివపూజా

సమయమునను భావింపవలెనని శివాద్వైతసిద్ధాంతము శైవ మహా జనులు నంగీకరించియున్నారు.

## పురశ్చరణ విధానము

భోగమును మోక్షమును ప్రసాదించు శివపంచాక్షరిని సద్గురువు కడ నుపదేశమును పొంది మొదట నొక పురశ్చరణం జేయవలెను. పునశ్చరణమనగా? మంత్రమును తనకు అభిముఖముగా గావించుకొనుట యగును. ఐతే పురశ్చరణమును చేయువాడు-ప్రతిదినము

**శ్లో॥ ఏకవారం మితాశీతు - వాగ్యతో నియతేంద్రియః॥**

ఒకపర్యాయము మితముగా ఆహారమును తీసుకొనుచు మంత్ర జపసమయమున నింద్రియములను కట్టుపఱచి మౌనముగా నుండవలెను. అక్షరమునకు లక్ష చొప్పున ఐదులక్షలు జపించినచో పురశ్చరణ యగునని సాధారణ నిర్వచనము.

"కలౌ చతుర్గుణం ప్రోక్తమ్" అను వాక్యము ననుసరించి పంచాక్షరికి ఇరువదిలక్షలు, షడక్షరికి ఇరువదినాలుగు లక్షలు జపము జేశినచో నొక పురశ్చరణమగునని విశేష నిర్వచనము.

**శ్లో॥ జపే దక్షరలక్షంవై -చతుర్గుణిత మాదరాత్.**
**నక్తాశీ సంయమీ యః స-పౌరశ్చరణికః స్మృతః॥**

పురశ్చరణంజేయువాడు-అలసటలేనివాడై అక్షరమునకు నాల్గు లక్షలచొప్పున మహామంత్రమును జపించుచు నక్తభోజనము. ఇంద్రియ నిగ్రహమున్ను కలిగియున్నచో కృతార్థుడగునని శివపురాణము వక్కాణించినది.

సాధారణ పురశ్చరణము: ప్రతిదినము పండ్రెండువేల ఐదు వందలు (12500) జపించినచో నలుబది (40) దినములకు ఐదులక్షల సంఖ్యతో పూర్తి యగును. పంచాక్షరిని ప్రణవసహితముగా జపించు నెడల ప్రతిదినము పదియైదువేల (15000) చొప్పున (40 ది.)ఆరులక్షల సంఖ్య పూర్తి యగును.

ప్రాతఃస్నానము, భస్మధారణ, సంధ్యావందనము ఐనతరువాత అనుకూలస్థలమునందు మృదుఆసనముపై పద్మాసనముగా ఆసీనుడై

సచ్చిదానందమయుడైన సదాశివుని హృదయకమలమున స్మరించి శాంభవదీక్షాగురువును ప్రార్థించియు ఉత్తరాభిముఖుడై (లేక పూర్వాభిముఖముగాను) ఏకాగ్రచిత్తముతో మహామంత్రమును జపింపవలసియుండును.

జపము - మానసిక ఉపాంశు వాచికములని ముప్విధము

శ్లో॥ వాచికస్త్వేకఏవ స్యా-దుపాంశుః శత ముచ్యతే।
సాహస్రో మానసః ప్రోక్తః॥

వాచికజపమువలన ఒకే అంశము ఫలము కలుగును. ఉపాంశు జపము నూఱుమడుంగులు ఫలితము నిచ్చునది. మానసికజపము వేయిరెట్లు సిద్ధిప్రదమగును. మానసికజపము కష్టసాధ్యమగుటచే ఉపాంశు జపమున పురశ్చరణఁ గావించుట శ్రేయస్కరమని తెలియవలెను.

వ్రేలపై చేయు జపముకన్న వ్రేలరేఖలపై గావించు జపము శ్రేష్ఠము. అనఁగా ఎనిమిదిరెట్లు అధికముగా ఫలము నిచ్చును. పుత్రజీవములను పూసలతో చేయఁబడు జపము పదిరెట్లు, శంఖమణులతో నూరురెట్లు, పగడములతో వేయిరెట్లు, స్ఫటికములతో పదివేల రెట్లు, ముత్యాలతో లక్షరెట్లు, కమలపు పూసలతో పదిలక్షలరెట్లు, బంగారు మణులతో కోటిరెట్లు, విశేషఫలప్రదమగును.

శ్లో॥ కుశగ్రంథ్యా చ రుద్రాక్షై-రనంత గుణితంభవేత్॥
దర్భముడులతో రుద్రాక్షములతోడను చేయు జపము అనంతఫలప్రదమగును.

## జపమాలా వివరము

పంచదశ (15) రుద్రాక్షములతో నమర్చబడిన జపమాల-శత్రువశీకరణఁగావించునది.

పంచవింశతి (25) రుద్రాక్షముల జపమాల - ముక్తిప్రదము.
సప్తవింశతి (27) రుద్రాక్షముల జపమాల-శరీరపుష్టిఁగలుగఁజేయును.
త్రింశత్ (30) రుద్రాక్షముల జపమాల - ధనప్రదము.

పంచాశత్ (50) రుద్రాక్షముల జపమాల–సర్వఫలములను మధ్యమ
[ముగా నిచ్చును.

శత (100) రుద్రాక్షముల జపమాల – ఉత్తమము.
అష్టోత్తరశత (108) రుద్రాక్షముల జపమాల – ఉత్తమోత్తమమగును.

ఒక్కొక్క ఆవర్తనకు ఒక్కొక్క రుద్రాక్షను కుడిచేతిని బొటన వ్రేలి స్పర్శతో అనామిక (నాలుగవ వ్రేలు)పై తనవైపు జరుపుచుండ వలెను. అంగుష్ఠస్పర్శలేని జపము నిష్ఫలము.

పంచాక్షరీజపమునకు గృహమునకన్న గోశాల – నూరురెట్లధికము, పావనఅరణ్యప్రదేశము గోశాలకన్న వేయిరెట్లుఫలప్రదము. పర్వతము పదివేలరెట్లు ఫలావహము. నదీతీరము లక్షరెట్లు. దేవాలయము కోటి రెట్లున్ను ఫలప్రదము.

## జ ప వి ధా న ము

"అనంతం శివసన్నిధౌ" పరమేశ్వరుని సన్నిధిని గావించుజపము అనంతమైన ఫలమునొసగును.

శ్లో॥ సూర్యస్యాగ్నే ర్గురో రిందోః–దీపస్య చ జలస్య చ।
విప్రాణాం చ గవాం చైవ – సన్నిధౌ శస్యతే జపః॥

సూర్యాభిముఖముగా, అగ్నిసన్నిధిని, గురుమూర్తిఛాయాపటము నకు ఎదురుగా, చంద్రుని చూచుచు, దీపముచెంత, పవిత్రజలము చేరువను, మాహేశ్వరులవద్ద, గోమాత సమీపమునను శివపంచాక్షరీ జపము సమంజసంబైనది.

జపసమయమున అలసటకలిగెనేని కొంతతడవు శివధ్యానమును "శాంతంపద్మాసనస్థమ్"అనురీతిని చేయవచ్చును. ఉదయము మొదలు కొని మధ్యాహ్నము ఒంటిగంటవరకు మరల సాయంత్రము ఐదుగంటల నుండి రాత్రి ఎనిమిదిగంటలవరకు జపమును చేయవచ్చును.

గురుమూర్తి ఛాయాపటముముందు దీపము వెలిగించి గణపతిని ప్రార్థించి దేశకాల సంకీర్తనము గావించి మనోభీష్టము సిద్ధించుటకై సంకల్పమును గావించి జపప్రారంభమును చేయవలెను.

శ్లో॥ సూర్యాగ్నివిప్రదేవానాం-గురూణామపి సన్నిధౌ ।
అన్యేషాం చ ప్రశస్తానాం-మంత్రం న విముఖో జపేత్॥

సూర్యునియొక్కయు అగ్నియొక్కయు మాహేశ్వరుల యొక్కయు దేవతలయొక్కయు గురువులయొక్కయు ప్రశంసనీయులైన వ్యక్తులయొక్కయు సన్నిధిని విముఖుడై అనఁగా పైవారికి పృష్ఠభాగముగా మంత్రజపమును చేయరాదు.

**జపకాల నిషిద్ధములు**

తలపాగఁదాల్చుట, కవచమును ధరించుట, దిగంబరత్వము వెంట్రుకలు విరియబోసుకొనుట, ఇతరులు బలాత్కారముగా లాగుట, చేతులు కాళ్ళు మొదలగు అవయవముల అపరిశుభ్రత, స్నానాదులు లేక నపవిత్రుడై యుండుట, అఱచుట, మాటలాడుట, క్రోధము, మదము, తుమ్ములు, ఆవలింతలు, నీచప్రాణుల నవలోకించుట, జపకాలములో పనికిరావు. ప్రమాదవశమున నెద్దియేని సంభవించినచో ఆచమనముఁజేశి శివస్మరణఁగావింపవలెను. సూర్య చంద్ర నక్షత్రములలో ఏదేనొకదానిని చూచి నమస్కరింపవలెను.

శ్లో॥ అనాసనః శయానో వా-గచ్ఛన్నుత్థిత ఏవ వా।
రథ్యాయా మశివే స్థానే-న జపేత్తి-మిరాంతరే॥
ప్రసార్య న జపేత్ పాదౌ-కుక్కుటాసన ఏవ వా
యాన శయ్యాధిరూఢో వా-చింతావ్యాకులితోఽథవా॥

ఆసనము లేకుండా జపమును చేయరాదు పడుకొని జపింపగూడదు. నడచుచు జపమును గావింపరాదు. నిలువబడి జపము నొనర్పఁగూడదు.

వీధియందును అమంగళస్థానమున చీకటిలోను కాళ్ళు చాపుకొనియు గొంతుకూర్చుండియు అశ్వాదివాహనముల నధిష్ఠించియు పడకపైనుండియు చింతతో వ్యగ్రుడై జపముఁజేయుట శ్రేయస్కరము కాజాలదు.

శ్లో॥ శక్తశ్చేత్సర్వ మేవైత-దశక్తః శక్తితో జపేత్॥

పైన చెప్పఁబడిన నియమములన్నియు శారీరకశక్తి గలవానికే సరిపడును. ఒకవేళ దైవవశమున ఏదేని అనారోగ్యాదికారణము తటస్థించినయెడల తనశక్తి ననుసరించి జపించుటలో ఎట్టిదోషము లేదు.

విగ్రహములయందు దేవతాబుద్ధి, వేదశాస్త్రములపై ప్రమాణ బుద్ధి, పెద్దలయందు భక్తివిశ్వాసములున్ను, కలిగిన ఆస్తికులకు ఒకానొకప్పుడు ప్రమాదము ఏర్పడినను సదాచారము భంగపడినను జప ఫలము శివానుగ్రహమువలన సమకూరునదియేను.

శ్లో॥ సర్వావస్థాం గతస్యాపి – మయి భక్తిమతః పరమ్।
సిద్ధ్యత్యేవ న సందేహో – నాపరస్యతు కస్యచిత్॥

సర్వవిధరోగాదిబాధలను పొందినవాడైనను నాయందు భక్తి మాత్రము కలిగినవాడైనచో శివపంచాక్షరీమహామంత్రమును జపించు నెడల సంసిద్ధి కలవాడగును. నాయందు భక్తిలేకుండా నియమబద్ధుడై జపించినను జపసిద్ధి యవ్వానికి కలుగఁజాలదు అని శివనిర్వచనము.

శివపంచాక్షరీమహామంత్రము – ఋగ్వేద సామవేదముల మధ్యనుండు యజుర్వేదములో నాలుగవకాండయందు రుద్రాధ్యాయములో మణిస్థగితరత్నమువలె విరాజిల్లుచున్నయది. అక్షర అల్పత్వము అర్థ బాహుళ్యము గలదియు శివనామఘటితంబు నగు షడక్షరీమహామంత్రము భోగమోక్షముల నిచ్చుననుటలో నిసుమంతయు సందియము గానరాదు. పాపములన్నిటికిని ప్రాయశ్చిత్తము శివపంచాక్షరీమంత్ర జపంబే యని గురుతెలుగవలెను. అజ్ఞానమను మైలను జ్ఞాన (ఉపాసన)మనెడు శుభ్రజలముతో కడిగివేయు విరాగుల (సన్న్యాసుల) కును శివధ్యానము శివపంచాక్షరీమంత్రానుష్ఠానంబు ననివార్యంబులేయగును.

శ్లో॥ ధిక్ భస్మరహితం ఫాలం–ధిక్ గ్రామ మశివాలయమ్।
ధిగనీశార్చనం జన్మ॥

భస్మరుద్రాక్షములఁ దాల్చి శివమంత్రజపమును చేయని జన్మ–వ్యర్థము; శివాలయములేని గ్రామము–నివాసయోగ్యము కాదు. శివారాధనఁ జేయని మానవుఁడు – వృథాజన్మకలవాడగును.

కాషాయదండధారియగు యతియైనను భస్మరుద్రాక్షధారియై నిత్యము ప్రణవముతో సంధ్యావందనాది నిత్యకృత్యములఁ గావించి గురుప్రదత్త శివలింగార్చనను తప్పనిసరిగా చేయవలెనని ధర్మశాస్త్రము విధించినది. శివారాధనమునకు శంఖోదకము పనికిరాదని శివపురాణము నిరూపించినది. కాషాయదండధారణమాత్రమున యతికి వందనమును చేయవలెనని చెప్పినట్లు భస్మరుద్రాక్షశివలింగధారణమాత్రమున శైవునకు శరణుగావింపవలెనని శివాగమములు నిర్దేశించినవి. కాశీ మృతునకు పునర్జన్మలేనట్లు శివలింగధారికి జన్మరాహిత్యమేనని శైవవాఙ్మయము చాటుచున్నయది.

సారాంశము.

శివపంచాక్షరీమంత్రము - స్థూలప్రణవమనఁబడును. ప్రణవము- సూక్ష్మపంచాక్షరి యనఁబడును. ఆరు లేక ఐదు లక్షల జపముతో సాధారణ పురశ్చరణమగును. ఇరువది లేక ఇరువది నాలుగులక్షల జపమున మహాపురశ్చరణమగును. సకలపాపప్రాయశ్చిత్తము శివపంచాక్షరీమంత్ర జపంబేను, నిత్యజపమును 108, 600, 1000, ఏదేనొకసంఖ్య నవలంబించి చేయవలెను.

ఇవ్విధము సద్గురుని సదుపదేశమువలన శివపంచాక్షరీమంత్రస్వరూపమును సంగ్రహార్థమును బాగుగా తెలుసుకొని మంత్రానుష్ఠానమును చేశినయెడల చిత్తశుద్ధియు శివజ్ఞానంబును కలవాడై దీర్ఘాయురారోగ్య భాగ్యములను వంశవృద్ధిని పొందుటయే గాక మోక్షసామ్రాజ్యమున పట్టభద్రుఁడగును

ఇట్లు బోధించిన ఆచార్యునకు కృతజ్ఞతాసూచకముగా శిష్యుడు గృహ ఆరామ క్షేత్రవిత్త వస్త్ర వాహనాదులను సమర్పించి పూజించియు గురుకుటుంబము వారందరికి పారితోషికముల నిచ్చియు ఆచార్యుని సకుటుంబముగా వీడ్కొలిపి గురుశివానుగ్రహపాత్రుఁడయ్యెను. సంవత్సరమునకు ఒకతూరి తాము సకుటుంబముగా దర్శనము నీయుఁడని ప్రార్థింపగా ఆచార్యుఁడంగీకరించి అనేక శుభ ఆశీర్వాదములతో శిష్యుని సకుటుంబముగా దీవించి స్వస్థానముఁ జేరి నిరంతరశివారాధనతత్పరుండయ్యెను.

శ్లో॥ యో విధాతా విధాతుశ్చ - కారణస్యాపి కారణమ్ ।
తేజసాం పరమం తేజః - స శివో నః పరా గతిః॥

—★—

## కొన్ని ముఖ్య సూచనలు.

సద్గురువులవారివద్ద ఉపదేశమును తీసుకొనిన మహామంత్రమును ప్రతిదినము ఉదయము స్నానము తరువాత భస్మను మూడురేఖలుగా నొసలు మున్నగుచోట్ల ధరించి ముప్పదిరెండురుద్రాక్షలమాలను మెడపై ధరించి తప్పకుండా జపింపవలెను. ప్రయాణాదులయందు స్నానమునకు ఆలస్యమగుయెడల స్నానము తరువాత జపమునకు తగినచోటు లభింపనియెడలను అతిప్రయత్నమున స్నానమాడి మానసికముగా మంత్రజపమును చేయవచ్చును. జ్వరము మొదలగు బాధలుసంభవించినచో భస్మస్నానమును చేయవలెను. ఆరోగ్యము ఉన్నపుడు మాత్రము స్నానమును భస్మరుద్రాక్షధారణమును ఒకానొకచో ఆసనముపై మంత్ర జపమును తప్పనిసరిగా గావింపవలెను. రుద్రాక్షలింగపూజనమును శివలింగార్చనను ప్రతిదినము ఒకసారియైనను ఎట్టిపరిస్థితిలో గూడ తప్పక ఆచరింపవలెను. ఇట్లు చేయనియెడల ప్రత్యవాయము అనగా దోషము ఏర్పడుటయేగాక దరిద్రదశ, రోగములు, కలహములు, అనేక సంసారకష్టములు సమకూరుచుండును.

స్వర్గములో కామధేనువు కల్పవృక్షము - చింతిత మనోభీష్టములనిచ్చునట్లు గురుమంత్రజపము శివారాధనము - సాధకులకు అఖండ ఐశ్వర్యమును విజ్ఞానమును సద్గుణసంపత్తిని సమకూర్చి అంత్యకాలమున మోక్షమును ప్రసాదించును.

### శివ పంచాక్షరీ మంత్ర జపవిధి.

ఓమ్ అస్య శ్రీ షడక్షరీ(పంచాక్షరీ) మహామంత్రస్య పరబ్రహ్మ ఋషిః, శైవీ గాయత్రీ ఛందః, పరశివో దేవతా, ఓంబీజం, నమః శక్తిః శివాయేతి కీలకం, మమ ఉపాత్త దురితక్షయద్వారా పరమేశ్వర ప్రీత్యర్థే షడక్షరీ (పంచాక్షరీ) మహామంత్రజపే వినియోగః॥

| | | |
|---|---|---|
| ఓం—అంగుష్ఠాభ్యాం నమః | ఓం శిఖాయాం | ఓంహృదయాయ నమః |
| నం—తర్జనీభ్యాం నమః | నం శిరసి | నం-శిరసే స్వాహా |
| మం—మధ్యమాభ్యాం నమః | మం ముఖే | మం-శిఖాయై వషట్ |
| శిం—అనామికాభ్యాం నమః | శిం హృదయే | శిం-కవచాయ హుం |
| వాం—కనిష్ఠికాభ్యాం నమః | వాం నాభౌ | వాం—నేత్రత్రయాయ వౌషట్ |
| యం— కరతలకరపృష్ఠాభ్యాం నమః | యంపాదద్వయే | యం-అస్త్రాయ ఫట్ |

భూర్భువః సువ రోమితి దిగ్బంధః॥

## ధ్యానం:

శ్లో॥ నమః శివాగ్నిబీజాయ - హరాయ పరమాత్మనే,
ఓమంత మంత్రరూపాయ - మూల పంచాక్షరాత్మనే॥

శ్లో॥ శాంతం పద్మాసనస్థం శశధరమకుటం పంచవక్త్రం త్రిణేత్రం
శూలం వజ్రంచ ఖడ్గం పరశు మభయదం దక్షభాగే వహంతమ్।
నాగం పాశంచ ఘంటాం ప్రళయహుతవహం చాంకుశం [వామభాగే
నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం పార్వతీశం నమామి॥

శ్లో॥ యో గురుః సశివః సాక్షాత్ - యః శివః సగురుః స్మృతః।
భుక్తి ముక్తి ప్రదాతాచ - తస్మై శ్రీ గురవే నమః॥

ఇచట తమ తమ గురువుల నామరూపములను స్మరింపవలెను. తరువాత గురుమంత్రమును గురువులవారి ఛాయాపటమును చూచుచుగాని ఎడమచేతిని రుద్రాక్షలింగమును (లేక) ప్రాణలింగము నవలోకించుచుగాని శంకరుని చిత్రపటమును గాంచుచుగాని కనులు మూసుకొని పరమేశ్వరుని జ్యోతిర్లింగముగా భావించుచుగాని మహామంత్రమును జపింపవలెను. జపానంతరము అంగన్యాసమునుగావించి "భూర్భువః సువరోమితి దిగ్విమోకః,, "పార్వతీపరమేశ్వర చరణారవిందార్పణ మస్తు"అనుచు పళ్ళెరములో జలమును విడువవలెను.

## శివపూజా విధాన సంగ్రహము

శ్లో॥ అపవిత్రః పవిత్రో వా - సర్వావస్థాం గతోపి వా।
యః స్మరేద్దైవ విరూపాక్షం-స బాహ్యాభ్యంతరే శుచిః॥

అనుచు శిరమున నీరు చల్లుకొనవలెను.

## ఆచమనము

శంభవే నమః । శంకరాయ నమః । శాంతాయ నమః । శాశ్వతాయ నమః । శివ । స్థాణో । భవానీపతే । భూతేశ । త్రిపురాంతక । త్రిణయన । శ్రీకంఠ । కాలాంతక । శర్వ । ఉగ్ర । అభవ । భర్గ । భీమ జగతాంనాథ । అక్షయ । శ్రీనిధే । రుద్ర । ఈశాన । మహేశ । మహాదేవాయ నమః॥

## ప్రాణాయామము

ఓం భూః, ఓం భువః, ఓం సువః, ఓం మహః, ఓం జనః, ఓంతపః, ఓం సత్యం, ఓమాపో జ్యోతీ రసోమృతం బ్రహ్మభూర్భువః సువరోమ్.

## సంకల్పము

శ్రీ శివ శివ! శంభో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోః దక్షిణదిగ్భాగే శ్రీశైలస్య........(వాయవ్య) ప్రదేశే కృష్ణా (గంగా) గోదావర్యోః మధ్య ప్రదేశే (స్వ) గృహే సమస్త దేవతా మాహేశ్వర గురుచరణసన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన........నామ సంవత్సరే ........అయనే........ఋతౌ....... మాసే........పక్షే.... . తిథౌ ........ వాసరే శుభయోగే శుభకరణే ఏవంగుణవిశేషణ విశిష్టే శుభే అభ్యుదయ ముహూర్తే శ్రీమాన్........గోత్రః, శ్రీమతః....గోత్రస్య మమ సకుటుంబస్య ఉపాత్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వరప్రీత్యర్థం శివ పూజనం (గురుపూజనం) కరిష్యే.

తదంగత్వేన పృథివీ కలశ గణాధిపతి పూజనం కరిష్యే.

పృథివ్యైనమః-సకలోపచారార్థే అక్షతాః సమర్పయామి.

కలశములో భస్మ గంధ అక్షత పుష్ప బిల్వములను సమర్పించి పంచదార వేయవలెను. తరువాత కలశముపై చేయి నునిచి

శ్లో॥ గంగే చ యమునే కృష్ణే - గోదావరి సరస్వతి ।
నర్మదే సింధుకావేర్యా - జలేఽస్మిన్ సన్నిధిం కురు॥

అని చదివి చేయి తీసి కలశోదకమును పుష్పముతో దేవునిపై తనపైనను పూజాద్రవ్యములపైనను చల్లవలెను.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం - శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయే - సర్వవిఘ్నోపశాంతయే॥

అని గణపతిని ప్రార్థించి ధ్యాన ఆవాహన ఆసన పాద్య అర్ఘ్య ఆచమన పంచామృత శుద్ధోదకస్నాన భస్మ యజ్ఞోపవీత గంధ అక్షత హారిద్రా కుంకుమ పుష్ప బిల్వ ధూప దీప నైవేద్యములను దక్షిణాఫల తాంబూలములను మంగళనీరాజన మంత్రపుష్పములను సమర్పింపవలెను. తరువాత

శో॥ వక్రతుండ మహాకాయ - కోటిసూర్య సమప్రభ
అవిఘ్నం కురుమేదేవ - సర్వకార్యేషు సర్వదా॥

అని గణపతికి నమస్కారమును చేయవలెను.

## శివ పూజనము

శివుఁడే సర్వాత్మకుఁడనియు పరదైవమనియు శివునితో సమానుడుకాని శివునికన్న అధికుడు గాని లేడనియు బ్రహ్మవిష్ణ్వాదదేవతలు శివదర్శనమునకై ఇప్పటికిని ఘోరతపంబులఁజేయుచున్నారనియు ఇట్టి సర్వాతీతస్థితి గలవాడైనను భక్తసులభుడనియు కృపాపూర్ణహృదయుడనియు శివానుగ్రహమువలననే నేను ముక్తుడ నగుదు ననియు రామతారకము మొదలగు మంత్రములు ఇటీవల ప్రసిద్ధములైనవనియు శివనామము రామకృష్ణాదినామములకన్న శతకోటి అనంతముగా ఉత్తమంబనియు శివుఁడు రామతారకమును జపించెనని చెప్పు అధములు పిశాచములై జన్మింతురనియు భావించి గావించు పరమేశ్వరునిఆరాధన ఇహపరశ్రేయస్కరంబగును.

శివధ్యానము

శ్లో॥ ధ్యాయే నిత్యం మహేశం రజతగిరినిభం చారుచంద్రావతంసం
రత్నాకల్పోజ్జ్వలాంగం పరశు మృగవరాభీతి హస్తం ప్రసన్నమ్।
పద్మాసీనం సమంతాత్ స్తుత మమరగణై ర్వ్యాఘ్రకృత్తిం వసానం
విశ్వాద్యం విశ్వవంద్యం సకలభయహరం పంచవక్త్రం త్రిణేత్రం॥

శివాయ సాంబాయ నమః ధ్యాయామి. అవాహయామి. ఆసనార్థే అక్షతాన్ సమర్పయామి. పాదయోః పాద్యం, హస్తయోః అర్ఘ్యం, ముఖే ఆచమనీయం సమర్పయామి. పంచామృత (పాలు, పెరుగు, నెయ్యి, తేనె, పంచదార) స్నానం సమర్పయామి.

నమస్తే అస్తుభగవన్ విశ్వేశ్వరాయ మహాదేవాయ త్ర్యంబకాయ త్రిపురాంతకాయ త్రికాగ్నికాలాయ కాలాగ్నిరుద్రాయ నీలకంఠాయ సర్వేశ్వరాయ సదాశివాయ శ్రీమన్మహాదేవాయ నమః (శివకవచమును మహిమ్నఃస్తోత్రమును చెప్పవచ్చును.)

శివాయ సాంబాయ నమః నారికేళోదకేన శుద్ధోదకేన(చ)స్నానం సమర్పయామి. ప్రతిష్ఠాపనార్థే యజ్ఞోపవీతార్థే సర్వాభరణార్థే చ అక్షతాన్ సమర్పయామి.

శ్లో॥ శ్రీకరంచ పవిత్రం చ - శోకరోగ నివారణం ॥
లోకవశ్యకరం పుణ్యం - భస్మ త్రైలోక్యపావనమ్॥

శివాయ సాంబాయ నమః భస్మ విలేపనం సమర్పయామి.

శ్లో॥ మలయాచల సంభూతం - కర్పూరేణ సమన్వితం ।
విలేపనం సురశ్రేష్ఠ - ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్॥

శివాయ సాంబాయ నమః శ్రీగంధం సమర్పయామి.

శ్లో॥ అక్షతాన్ ధవళాకారాన్ - సమాషాన్ శ్వేతతండులాన్।
చణకగోధుమ సంయుక్తా - నర్పయామి సదాశివ॥

శివాయ సాంబాయ నమః అక్షతైః పూజయామి.

శ్రీ పార్వతీదేవ్యై హరిద్రాకుంకుమ పరిమళద్రవ్యాణి సమర్పయామిః

శివాయ నమః మహేశ్వరాయ నమఃశంభవే నమః పినాకినే నమః శశిశేఖరాయ నమః వామదేవాయ నమః విరూపాక్షాయ నమః కపర్దినే నమః నీలలోహితాయ నమః శంకరాయ నమః శూలపాణయే నమః అంబికానాథాయ నమః శ్రీకంఠాయనమః భక్తవత్సలాయనమః భవాయ నమః శర్వాయ నమః గంగాధరాయ నమః లలాటాక్షాయ నమః కాల కాలాయ నమః కైలాసవాసినే నమః విశ్వేశ్వరాయ నమః నానావిధ పుష్పాణి సమర్పయామి.

శ్లో॥ త్రిదళం త్రిగుణాకారం-త్రిణేత్రం చ త్ర్యాయుధమ్।
త్రిజన్మ పాపసంహారం - ఏకబిల్వం శివార్పణమ్॥

శివాయ సాంబాయ నమః కోమల బిల్వదళాని సమర్పయామి.

అధికముగా పుష్పములను బిల్వదళములను సమర్పించునెడల శివసహస్ర అష్టోత్తరశతనామములను చదువవలెను.

ధూపం ఆఘ్రాపయామి, దీపం ప్రదర్శయామి. శర్కరాద్రాక్షా ఫలాదినైవేద్యం సమర్పయామి. స్వర్ణపుష్పదక్షిణాం తాంబూలం నారికేళాదిఫలం సమర్పయామి.

శ్లో॥ మంగళం భగవన్ శంభో - మంగళం వృషభధ్వజ।
మగళం పార్వతీనాథ - మంగళం కరుణానిధే॥
కైలాసాచలవాసాయ - కామితార్థప్రదాయినే।
విశాలాక్షీసమేతాయ - విశ్వనాథాయ మంగళమ్॥

కర్పూరగౌరం కరుణావతారం-సంసారసారం భుజగేంద్రహారమ్।
సదా వసంతం హృదయారవిందే-భవం భవానీసహితం నమామి॥
మందారమాలాకులితాలకాయై - కపాలమాలాంకిత కంధరాయ।
దివ్యాంబరాయైచ దిగంబరాయ - నమః శివాయై చ నమః శివాయ॥

శివాయ సాంబాయ నమః మంగళనీరాజనం కర్పూరనీరాజనంచ సమర్పయామి.

శ్లో॥ వందే శంభు ముమాపతిం సురగురుం వందే జగత్కారణం
వందే పన్నగభూషణం మృగధరం వందే పశూనాం పతిమ్।

36
3

## శ్రీ శివ పంచాక్షరీ మహామంత్రార్థము

వందే సూర్యశశాంకవహ్నినయనం వందే ముకుందాత్ పరం
వందే భక్తజనాశ్రియం చ వరదం వందే శివం శంకరమ్॥

శివాయ సాంబాయ నమః మంత్రపుష్పం సమర్పయామి. నమస్కారాన్ సమర్పయామి. ప్రార్థయామి. అనేన పూజనేన సర్వాత్మకః శ్రీశివః ప్రీయతామ్.

కాలహర ! కంఠహర ! దుఃఖహర ! దారిద్ర్యహర ! సర్వ పాపహర ఓంహర !

తీర్థగ్రహణమంత్రము.

శ్లో॥ అకాలమృత్యుహరణం - సర్వవ్యాధినివారణం ।
సమస్తదురితోపశమనం - సద్గురు (శ్రీశివ) పాదోదకం
(పావనం శుభమ్॥

స్త్రీలు కుంకుమ పెట్టుకొను మంత్రము.

శ్లో॥ అమరీ కబరీ భార - భ్రమరీ ముఖరీకృతం ।
దూరీకరోతు దురితం - గౌరీచరణ పంకజమ్॥

సర్వం శ్రీ సాంబసదాశివ చరణారవిందార్పణ మస్తు.

---

## సూచన.

ఈ పుస్తకమును అందజేశిన పిమ్మట ఎవరైనను విరాళము నొసగుదురేని వారి నామధేయములు ముందు వెలువడబోవు గ్రంథములలో ప్రకటింపఁబడును. వలయువారు త్వరలో తెలుపుదురు గాత !

గురుశిష్యసంవాదము మొదలగు గ్రంథములు దొరుకుటకు స్థిరసంకేతము.

**శ్రీ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులవారు,**
సర్వమంగళాసదనము, మారేడుపల్లి (నెహూ్రనగర్)
184 A. సికింద్రాబాద్. (ఆంధ్రప్రదేశ్.)

---